# శ్రీగాయత్రీ జ్యోతిషవిజ్ఞాన సంస్థ

# శ్రీ సర్వధారి నామసంవత్సర

# 2008 దృగ్గణిత పంచాంగము 2009

## సూర్యస్తవము

యః కర్తా జగతాం భర్తా సంహర్తా మహసాం నిధిః।
ప్రణమామితమాదిత్యం బహిరన్తః తమోపహామ్ ॥

## శ్రీగాయత్రీ ధ్యానము

ముక్తావిద్రుమ హేమనీలధవళఛ్ఛాయైర్ముఖైస్త్రీక్షణై
ర్యుక్తామిందునిబద్ధరత్నమకుటాం తత్త్వార్థ వర్ణాత్మికాం।
గాయత్రీం వరదాభయాంకుశకశశ్శుభ్రంకపాలం గదాం
శంఖం చక్రమధారవిందయుగళాం హస్తైర్వహన్తీం భజే॥


### పంచాంగకర్త

జ్యోతిషమహార్ణవ,వాస్తు సమ్రాట్,వాస్తునిధి, జ్యోతిషవాస్తుబ్రహ్మ,అనువంశిక జ్యోతిషాచార్య

" దైవజ్ఞ" గోరస వీరభద్రాచార్యులు ఎం,ఏ;

శాఖాధిపతి, జ్యోతిష-వాస్తుశాఖ,

పొ.శ్రీ. తెలుగు విశ్వవిద్యాలయము, హైదరాబాద్ - 4,

వీరికుమారులు చిరంజీవి వీరబ్రహ్మాచార్యులు (ఎం.సి.ఏ)

శ్రీ గాయత్రీజ్యోతిషవిజ్ఞాన సంస్థ; 34, మైత్రీపురం,కర్మన్‌ఘాట్, హైదరాబాద్ -79

ఫోన్ - 9866520840; 9247218718

Re.No-1885/98

# శ్రీగాయత్రీ జ్యోతిషవిజ్ఞాన సంస్థ

34, మైత్రీపురం కర్మన్‌ఘాట్, హైదరాబాద్-79,
ఫోన్ - 9866520840, 9247218718

జ్యోతిషమహార్ణవ, వాస్తు సమ్రాట్, వాస్తునిధి, జ్యోతిషవాస్తుబ్రహ్మ, అనువంశిక జ్యోతిషాచార్య

"దైవజ్ఞ" గోరస వీరభద్రాచార్యులు ఎం.ఏ; వారి

## అమూల్య గ్రంథములు

1. మయవాస్తు రూ 80 లు
2. పురోహితదర్పని రూ 150 లు
3. వాస్తువిజ్ఞాన చంద్రిక రూ 120 లు
4. గ్రహదశాయోగఫలవిన్యాసము అను మహాదశాపారిజాతము రూ 100 లు
5. విశ్వకర్మ వాస్తువిద్యా రహస్యములు రూ 250 లు
6. శ్రీ గోరసవారి భవిష్య పంచాంగము 2000 నుండి 20025 వరకు రూ 411 లు
7. లాటిట్యూడ్ - లాంగ్‌ట్యూడ్స్ రూ 51 లు (ప్రపంచమునందలి అన్ని ముఖ్య ప్రదేశములకు)
8. లగ్న పారిజాతము
9. నక్షత్ర పారిజాతము
10. శ్రీ సర్వధారినామసంవత్సర దృగ్గణిత పంచాంగము రూ 15 లు

పై గ్రంథములు కావలసినవారు ముందుగా పైకమును ఎం.ఓ ద్వారాచెల్లించి గ్రంథములు పొందవచ్చును లేదా స్వయముగా వచ్చి పొందవచ్చును. పోస్టలు ఖర్చులు అదనము. రూ 1000 లు గ్రంథములు కొన్నవారికి 20% కమీషను ఇవ్వబడును.

## వారములలో చేయదగిన కార్యాలు

ఆదివారముః- ఉద్యోగములో చేరడము, మంగళ కార్యాలు , లోహం, చెక్క, చెర్మ, ఊకపనులు, ఉత్సవాలు, యుద్ధం, నృపాభిషేకం, ధ్యాన క్రియలు, అస్త్ర కర్మలు, వ్యవసాయ పనులు ప్రారంభించడం, ఔషధ సేవనం, వైద్యుని సంప్రదించడం, మంత్ర తంత్రాలు, ఉపదేశాలు, ఉల్లి, పొగాకు , మిర్చి, మొదలగు తోటలు వేయడం, ఉత్తర దిక్కు ప్రయాణం, కెంపు ధరించడం చేయవచ్చు.

సోమవారముః- ముత్యం, స్ఫటికం, నూతులు, కాలువలు, చెఱువులు, జలం, ఉపనయనం, భూమి, పైకప్పులు, సంగీత, నృత్య, నాటకాలు, స్థంభ ప్రతిష్ట , భూసంబంధ కార్యాలు, వెండివస్తువులు ఉపయోగించడం, తెల్లని వస్త్రములు ధరించడం, ముత్యాలు ధరించడం, దక్షణ దిక్కు ప్రయాణం, కృషి , సమస్త వాస్తు కళలు చేయవచ్చు.

మంగళవారంః- విష, అగ్ని , ఆయుధ, ఉగ్ర , అసత్య క్రియలు, వెండి , బంగారం, రాగి, ఇత్తడి, ఇనుము, ధాతువులు కరిగించడం, కోర్టువ్యవహారాలు , ధైర్య సాహస విషయాలు, కందులు, వేరుశెనగ వంటి ధాన్యాలు సాగుచేయడం, తూర్పుదిక్కుకు ప్రయాణం, పగడపు ఉంగరం ధరించడం చేయవచ్చు.

బుధవారంః- బంగారం మొదలైన నగలు చేయడం,. వాహనం, శిల్పం, విద్య, రాజీలు, వివాహం, వ్యాపారం, క్రయ విక్రయాలు, గణితం, రత్నాభరణ ధారణ, దస్తావీజులు, నూతన వ్యాపారాలు, యుక్తిగా కార్యాలు నిర్వర్తించుట, చిత్ర, శిల్ప, గణిత శాస్త్ర, వ్యాకరణవిద్యలను అభ్యసించుట, అరటి, కొబ్బరి, మామిడి, తోటలు పెంచడం, పెసలు మొదలైన పైర్లు వేయడం, పడమటకు ప్రయాణం మంచిది.

గురువారంః- యజ్ఞయాగాది క్రియలు, వివాహాదిశుభకార్యాలు, వైదిక కార్యాలు, నూతన విద్యారంభ, వృక్షదోహద క్రియలు, అలంకార ధారణ క్రియలు, యుద్ధారంభం, అక్షరాభ్యాసం, తీర్థయాత్రలు, గురువులను, దేవతలను పూజించడం, శెనగలు, చెరుకు, ప్రత్తివంటి వ్యాపారాలు, ప్రారంభించడం, పుష్యరాగం ధరించడం, మొదలగునవి.

శుక్రవారంః- స్త్రీ సంబంధ క్రియలు, ముత్యం , వజ్రం, వైఢూర్యం, భరణ ధారణ, సుగంధ శయ్యాభరణాలు, ఉద్యోగ కృషి, వ్యవసాయం, కాలువలు, వివాహం, పుష్ప సంబంధమైన మంగళ కార్యాలు, నూతన వస్త్రములు ధరించడం, రాజకీయ రంగ ప్రవేశం, ధాన్య సంబంధపు పనులు ప్రారంభించడము, సాహిత్య విషయాలు, కళలు నేర్చుకోవడం, ఉత్తరం వైపు ప్రయాణం మంచిది.

శనివారముః- చెక్కుట, సీసపు పనులు, దీక్షావలంబన , తగరం, లోహపు పనులు, స్థిరమైన పనులు, గృహ నిర్మాణాది పనులు, ఆవులు, గేదలు మొదలగునవి ఇనుమునకు సంబందించినవి, పాపకార్యాలు, అసత్య వాదన, దాసదాసీలను చేర్చుకోనుట మొదలగు పనులకు మంచిది. ఆయుధ నిర్మాణం, మోసం, దుష్ట సంభాషణం, శనిదోష పూజాది కార్యక్రమాలు.

## తిథులలో చేయదగినకార్యాలు

పాడ్యమి ః-అధిపతి ధాత; వివాహం,యాత్ర,చౌదం,సీమంతం, దేవతా ప్రతిష్ట , గృహప్రవేశం,వృక్షచ్ఛేదన మొదలగు శుభకర్మలు.

విదియః అధిపతి - విధాత; వాస్తుకార్యాలు,ప్రతిష్ట,యాత్ర,వివాహం, గృహకర్మలు, స్వర్ణ,రజతభూషణ ధారణ,సమస్త సృష్టికర్మలు.

తదియంః- అధిపతి -విష్ణుః; సంగీతం,శిల్పం, విద్యారంభ, సీమంత, అన్నప్రాశన,చౌలవ,గృహప్రవేశ,పశుక్రయ విక్రయాలు,ప్రతిష్టలు.

చవితిః అధిపతి-గణేశః ,(యమ); ఆయుధ,అగ్నిసంబంధ, శస్త్రమారణాధ్యఖిల కర్యలు.

పంచమిః-అధిపతి - నాగః; చర,స్థిర,రూపాలైన సమస్త శుభాలు, ఋణాలు ఇవ్వడం,మంగళోత్సవాలు, ఉపనయనం, వివాహం, గృహ శాంతిక పౌష్టికాలు.

షష్ఠిః- అధిపతి-కుమారః (షడానన); వస్త్ర అలంకార క్రియలు, యుద్ధ సామాగ్రి,పౌష్టిక క్రియలు చేయవచ్చు.

సప్తమిః- అధిపతి-రవి (శచీశ్వర); విదియ, తదియ,పంచమీ తిథులలో చెప్పబడ్డ కార్యాలు చేయవచ్చు.

అష్టమిః- అధిపతి-మహేశః(వసు); వాస్తు,శిల్ప,నృత్య కారులు,స్త్రీ, రత్న, అలంకార క్రియలు, యుద్ధ సంబంధమైన క్రియలు,అఖిల లేఖనాలు, కృషి,వాణిజ్య.

నవమిః-అధిపతి-దుర్గ; అగ్నిమూలక కర్మలు,మిత్రభేదాదికాలు, సంభాషణ, ఘాతుక కర్మలు,విరోధాలుమొదలగువానికి పనికివస్తాయి.

దశమిః- అధిపతి-యమ(ధర్మ); 2,3,5,7 తిథుల్లో చెప్పబడినవి చేయవచ్చు. శాంతి పుష్ట్యాదికాలు,ప్రాసాధ స్తాపనం మొదలగు కార్యాలకు మంచిది.

ఏకాదశిః- అధిపతి-విశ్వ(శివ); వ్రతాలు,ఉపవాసాలు,అన్ని ధర్మకర్మలు, దేవతోత్సవాలు, వాస్తుయుద్ధ కర్మలు, వివాహ, కృషి,వాణిజ్య, భూషణాధికాలు, శిల్ప,నృత్య, గృహ కర్మలు.

ద్వాదశిః- అధిపతి-హరి(అర్క); శాంస్తీయ,పౌష్టిక కర్మలు. శుభకర్మలు చేయవచ్చు, యాత్ర, అన్న ప్రాశన చేయరాదు.

త్రయోదశిః-అధిపతి-కామః ; 2,3,5,10 తిథులకు చెప్పిన శుభ కర్మలు చేయవచ్చు.

చతుర్దశిః- అధిపతి-శివః(కలి); అగ్ని ప్రధాన, ఉగ్ర కృత్యాలు, యుద్ధ శస్త్ర,అస్త్ర,లోహ,వ్రణ, క్రియలు చేయవచ్చు.

పూర్ణిమః- అధిపతి-చంద్రః (విశ్వ); యజ్ఞ క్రియలు, మంగళ కృత్యాలు,వాస్తుకర్మలు, వివాహ,శిల్ప, అలంకార,దేవతా ప్రతిష్టలు చేయవచ్చు. అభ్యంగన, క్షౌర క్రియలు చేయరాదు.

అమావాస్యః- పితృదేవతలు; శుభ కర్మలు చేయరాదు,పిత్రుకర్మలు చేయాలి.

# దైవ ప్రార్థనలు



### గణపతిప్రార్థన

గణానాంత్వా గణపతిగ్ం హవామహే
కవిం కవీనాముపమశ్రవత్సమం
జ్యేష్టరాజం బ్రహ్మణాంబ్రహ్మణస్పత
అనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనం ॥

### గాయత్రీదేవి అవాహన



ఆగచ్ఛ వరదేదేవి త్ర్యక్షరే బ్రహ్మవాదిని
గాయత్రిచ్ఛందసాందేవి బ్రహ్మయోనర్నే మోస్తుతే ॥

### గాయత్రీ ధ్యానము

ముక్తావిద్రుమహేమనీలధవళచ్ఛాయైర్ముఖైస్త్రీక్షణైః
యుక్తామిందు నిబద్ధరత్నమకుటాం తత్వార్ధ వర్ణత్మికాం
గాయత్రీం వరదాభయాంకుశకశశ్శుభ్రం కపాలంగదాం
శంఖంచక్రమధారవిందయుగళాం హస్తైర్వహంతీం భజే ॥

### సూర్యస్తోత్రము



యఃకర్తా జగతాం భర్తా సంహర్తా మహసాం నిధిః
ప్రణమామి తమాదిత్యం బహిరంతస్త మోపహమ్

## నవగ్రహ స్తోత్రములు

: రవి:

జపాకుసుమ సంకాశం కాశ్యపేయం మహాద్యుతిం
తమోఽరిం సర్వపాపఘ్నం ప్రణతోస్మి దివాకరం॥

: చంద్రుడు :

దధి శంఖ తుషారాభం క్షీరోదార్ణవ సంభవం।
నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణం॥

: కుజుడు :

ధరణీ గర్భ సంభూతం విద్యుత్ కాంతి సమప్రభం
కుమారం శక్తిహస్తం తం మంగళం ప్రణమామ్యహం॥

: బుధుడు :

ప్రియంగు గుళికాశ్యామం రూపేణాఽప్రతిమం బుధం
సౌమ్యం సౌమ్యగుణోపేతం తం బుధం ప్రణమామ్యహం॥

: శుక్రుడు :

హిమకుంద మృణాళాభం దైత్యానాం పరమం గురుం
సర్వశాస్త్ర ప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహం॥

: గురుడు :

దేవానాంచ ఋషీణాంచ గురుం కాంచన సన్నిభుం
బుద్ధిమంతం త్రిలోకేశం తం నమామి బృహస్పతిం॥

: శని :

నీలాంజన సమాభాసం రవి పుత్రం యమాగ్రజం।
ఛాయా మార్తాండ సంభూతం తం నమామి శనైశ్చరం॥

: రాహువు :

అర్ధకాయం మహావీర్యం చంద్రాదిత్య విమర్దనం।
సింహికా గర్భసంభూతం తం రాహుం ప్రణమామ్యహం॥

కేతువు

ఫలాశ పుష్ప సంకాశం తారకా గ్రహ మస్తకం।
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం తం కేతుం ప్రణమామ్యహం॥



సూచన :- పైన సూచించిన గ్రహ శ్లోకములను నిత్యము పారాయణ చేసినచో గ్రహ సంబంధమైన బాధలు తొలగును. మరియు ప్రతినిత్యము ఉదయ కాలమున దీపారాధన చేసి ఇష్టదేవతా ప్రార్థన చేసినచో సమస్త దుష్కర్మలు ఉపశమించ గలవు. అన్నదానమువలన, సువర్ణ దానము వలన సుఖ శాంతులు కలుగును.

## నవగ్రహమంత్రములు

**రవి: వేద మంత్రము**

ఓం ఆకృష్ణేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యంచ
హిరణ్యయేన సవితా రథేనాధే హోయాతి భువనాని పశ్యన్ ॥

**బీజమంత్రము :** ఓం హ్రాం - హ్రీం - హ్రౌం - సః సూర్యాయ నమః
ఈ మంత్రాన్ని 40 రోజులలో 6000 జపం సుస్వరంగా చేయాలి.
తారాబల యుక్తమైన ఆదివారం నుండి ప్రారంభించాలి.

**చంద్రుడు : వేద మంత్రము**

ఓః అప్యాయస్వ సమేతుతే విశ్వతస్సోమ వృష్ణియం భవావాజస్య సంగధే
**బీజమంత్రము :** ఓం శ్రాం - శ్రీం - శ్రౌం సః చంద్రాయ నమః
ఈ మంత్రాన్ని 10 వేలు జపం సుస్వరంగా 40 రోజులలో చేయాలి.
తారాబల యుక్తంగా సోమవారం నుండి జపం ప్రారంభించాలి.

**కుజుడు : వేదమంత్రము**

ఓం అగ్నిర్మూర్ధాదివః కకుత్పతిః పృథివ్యాఽయం అపాగ్ం రేతాగ్ం సజన్వతి
**బీజమంత్రము :** ఓం క్రాం - క్రీం - క్రౌం- సః భౌమాయ నమః
ఈ మంత్రాన్ని 7 వేలు జపం సుస్వరంగా 40 రోజులలో చేయాలి.
తారాబలయుక్తమైన మంగళవారం నుండి జపం ప్రారంభించాలి.

**బుధుడు : వేద మంత్రము**

ఓం ఉద్బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహే సమిష్టాపూర్తేసగ్ం సృజే ధామయంచ
పునః కృణ్వగ్ంస్త్వా పితరం యువాన మన్వాతాగ్ం సీత్వయితంతు మే
**బీజమంత్రం :** ఓం బ్రాం - బ్రీం - బ్రౌం - సః బుధాయ నమః
ఈ మంత్రాన్ని 17 వేలు జపం సుస్వరంగా 40 రోజులలో చేయాలి.
తారాబలయుక్తమైన బుధ వారం నుండి ప్రారంభించాలి.

### గురుడు : వేదమంత్రము

ఓం బృహస్పతే అతియదర్యో అర్హాద్యుమద్విభాతి క్రతుమజ్జనేషు
యద్దీదయచ్ఛ వసత్త ప్రభాత తదస్మాసుద్రవిణం దేహిచిత్రం

**బీజ మంత్రం :** ఓం గ్రాం - గ్రీం - గ్రౌం - సః బృహస్పతయేనమః

ఈ మంత్రాన్ని 16 వేలు జపం సుస్వరంగా 40 రోజులలో చేయాలి.
తారాబలయుక్తమైన గురువారం నుండి ప్రారంభించాలి.

### శుక్రుడు : వేదమంత్రము

ఓం శుక్రంతే అన్యద్వజతంతే అన్యద్విషురూపే అహనీద్యౌరివాసి
విశ్వాహిమాయా అవసి స్వధావో భద్రాతే పూషన్నిహరాతి రస్తు

**బీజమంత్రము :** ఓం ద్రాం - ద్రీం - ద్రౌం--సః శుక్రాయనమః

ఈ మంత్రాన్ని 20 వేలు జపం సుస్వరంగా 40 రోజులలో చేయాలి.
తారాబలయుక్తమైన శుక్రవారం నుండి జపం ప్రారంభించాలి.

### శని: వేద మంత్రము

ఓం శమగ్నిరగ్ని భిస్కరశ్చన్నస్తపతు సూర్యః శం వాతో వాత్వరపా అపస్రిధః

**బీజమంత్రము :** ఓం ఖ్రాం - ఖ్రీం - ఖ్రౌం- సః శనయే నమః

ఈ మంత్రాన్ని 19 వేలు జపం సుస్వరంగా 40 రోజులలో చేయాలి.
తారాబలయుక్తమైన శనివారం నుండి జపం ప్రారంభించాలి.

### రాహువు : వేద మంత్రము

ఓం కయానిశ్చిత్ర అభవధూతీ సదావృధాస్సఖాః కయాశచిష్టయావృతా।

**బీజమంత్రము :** ఓం భ్రాం - భ్రీం - భ్రౌం - సః రాహవేనమః

ఈ మంత్రాన్ని 18 వేలు జపం సుస్వరంగా 40 రోజులలో చేయాలి.
తారాబలయుక్తమైన శనివారం నుండి జపం ప్రారంభించాలి.

### కేతువు : వేద మంత్రము

కేతుం కృణ్వన్న కేతవే పేశోమర్యా అపేశషే సముషద్భిరజాయధాః

**బీజమంత్రము :** ఓం ప్రాం - ప్రీం - ప్రౌం - సః కేతవేనమః

ఈ మంత్రాన్ని 7 వేలు జపం సుస్వరంగా 40 రోజులలో చేయాలి.
తారాబలయుక్తమైన మంగళవారం నుండి జపం ప్రారంభించాలి.

**సూచన: పై మంత్రములను గురుముఖతః నేర్చుకొని ఉచ్చారణా దోషము లేకుండా యధాశాస్త్రానుసారముగా జపించవలెను.**



## శని స్తోత్రము

కృష్ణస్థో పింగళో బభ్రుః కృష్ణో రౌద్రాంతకో యమః
సౌరిర్వనౌశ్చరో మందః పిప్పలాదేవ సంస్తుతః
నమస్తే కోణ సంస్థాయ పింగళాయ నమోస్తుతే
నమస్తే బభ్రురూపాయ కృష్ణాయచ నమోస్తుతే
నమస్తే రౌద్ర దేహాయ నమస్తేచాంతకాయచ
నమస్తే యమసంజ్ఞాయ శనైశ్చర నమోస్తుతే
ప్రసాదం కురుదేవేశ దీనస్య ప్రణతస్యచ

ఈ స్తోత్రము ప్రతిదినము ప్రాతః కాలము పఠించిన ఏలినాటి (ఏడున్నర సంవత్సరాల) శని బాధలు తొలగును.

## సూర్య నమస్కారములు

**మంత్ర సహితముగ**



సూర్య నమస్కారములు నిత్యము చేయుట వలన ఆయువు ఆరోగ్యము కలుగును. ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్ అని పెద్దల వాక్యము. సూర్య నమస్కారములు చేయునపుడు పూర్వులచే చెప్పబడిన ఆసనములతో కలిపి చేసిన సర్వరోగములు హరించును . ఆసనములను గురుముఖతః నేర్చుకొనుట మంచిది. ఒక్కొక్క మంత్రముచెప్పుచు ఒక్కొక్క ఆసనము వేసిన మంచిది లేదా సాష్టాంగ నమస్కారములు చేయుచు పఠించవలయును.

సప్తాశ్వరథమారూఢం ప్రచండం కశ్యపాత్మజం।
శ్వేత పద్మ ధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహం ॥

ఓం హ్రాం మిత్రాయ నమః ఓం హ్రీం రవయే నమః
ఓం హ్రూం సూర్యాయ నమః ఓం హ్రైం భానవే నమః
ఓం హ్రౌం ఖగాయ నమః ఓం హ్రః పూష్ణే నమః
ఓం హ్రాం హిరణ్య గర్భాయనమః ఓం హ్రీం మరీచయే నమః
ఓం హ్రూం ఆదిత్యాయ నమః ఓం హ్రైం సవిత్రే నమః
ఓం హ్రౌం అర్కాయ నమః ఓం హ్రః భాస్కరాయనమః

ఈ క్రింది మంత్రమును చెప్పునపుడు చేతిలో జలము వేసికొని మంత్రమును చెప్పిన తరువాత జలమును తీసికొనవలయును.

ఆదిత్యస్య నమస్కారాన్ యేకుర్వంతి దినేదినే
జన్మాంతర సహస్రేషు దారిద్ర్యం నోపజాయతే ॥
అకాల మృత్యు హరణం సర్వవ్యాధి నివారణం
సమస్త పాప క్షయకరం శ్రీ సూర్య పాదోదకం పావనం శుభం

## ఋణవిమోచక అంగారక స్తోత్రము

అస్య శ్రీ అంగారక స్తోత్ర మహామంత్రస్య గౌతమ ఋషిః, అనుష్టుప్ ఛందః అంగారక గ్రహో దేవతా, మమ ఋణ విమోచనార్థే జపే వినియోగః

చతుర్భుజో మేషగతో వరదశ్చ ధరాసుతః
మంగలో భూమిపుత్రశ్చ ఋణహర్తా ధనప్రదః ॥
స్థిరాసనో మహాకాయః సర్వకామ ఫలప్రదః
లోహితో లోహితాక్షశ్చ సామగానాం కృపాకరః ॥
ధరాత్మజః కుజోభౌమో భూమిజో భూమి నందనః
అంగారకో యమశ్చైవ సర్వరోగాపహారకః ॥
స్రష్టాకర్తాహర్తాచ సర్వదేవైశ్చ పూజితః
ఏతాని కుజనామాని నిత్యం యః ప్రయతః పఠేత్
ఋణం నజాయతే తస్య ధనం ప్రాప్నోత్యసంశయః
అంగారక మహీపుత్ర భగవన్ భక్తవత్సల
నమోస్తు మమాశేష ఋణమాశు విమోచయ
రక్తగంధైశ్చ పుష్పైశ్చ ధూపదీపైర్గుడోదనైః
మంగళం పూజయత్వాతు మంగళాహని సర్వదా
ఏకవింశతి నామాని పఠిత్వాతు తదంతికే
ఋణరేఖాప్రకర్తవ్యా అంగారేణ తదగ్రతః
తాశ్చ ప్రథమార్చయేత్ పశ్చాత్ నామపాదేన సంస్పృశన్
అంగారక మహీపుత్ర భగవన్ భక్తవత్సల
నమోస్తు మమాశేష ఋణమాశు విమోచయ
భూమిపుత్ర మహాతేజ స్వేదోద్భవ పినాకినః
ఋణార్తస్త్వాం ప్రసన్నోఽస్మి గృహాణార్ఘ్యం నమోస్తుతే
అతి సర్వం అంగారకార్పణమస్తు ॥



15. ధనుస్సంక్రమణము,మూల కార్తె
పొట్టి శ్రీరాములు వర్ధంతి,
18.ఎంటి ఆర్ వర్ధంతి,శ్రీ శారదా జయంతి
20. శ్రీ ఈశ్వరీదేవి ఆరాధన
21. ఉత్తరాయణ పుణ్య కాలము
22. సఫల ఏకాదశి
25. మాస శివరాత్రి, క్రిష్టమస్
27. సర్వేషాం వకుళ అమావాస్య

**పుష్యమాసము**

29. చంద్ర దర్శనము
30.మొహర్రమ్ ప్రారంభము

**2009 జనవరి**

01. నూతన ఆంగ్ల సంవత్సరాది
07. మత్రతయ ముక్కోటి ఏకాదశి
వివేకానంద స్వామి జయంతి
11. గురుమౌఢ్యమి ప్రారంభము
13.భోగి పండుగ
14. పెద్ద పండుగ, మకర సంక్రమణము
15. కనుమ, త్యాగరాధస్వామి ఆరాధన
16. ముక్కనుమ, బొమ్మల నోము ప్రారంభ
20. కుంభాయనము
21. మత్రతయ సత్తిల ఏకాదశి
23. నేతాజీ సుభాష్ చంద్రబోసు జయంతి
24. మాసశివరాత్రి, శనిత్రయోదశి
26.సూర్య గ్రహణము, రిపబ్లిక్ డే,
చొల్లంగి అమావాస్య

**మాఘమాసము**

27. చంద్ర దర్శనము
28. సఫర్
30.గాంధీ వర్ధంతి
31. శ్రీపంచమి, వసంతోత్సవ ప్రారంభము

**ఫిబ్రవరి**

02. రథసప్తమి, సూర్య జయంతి
05.భీష్మ ఏకాదశి
06.అంతర్వేది తీర్థము
09. మహామాఘి, గురుమౌఢ్యమి ఆఖరు
12. కుంభ సంక్రమణము
18. మీనాయనము
20. మత్రతయ విజయ ఏకాదశి, శ్రీ
రామకృష్ణ పరమహంస జయంతి
23. మాసశివరాత్రి, ఇదియే మహా శివరాత్రి
24. సర్వేషాం అమావాస్య

**ఫాల్గుణమాసము**

26. చంద్ర దర్శనము
27.రబ్బీలవ్వల్
28. పుత్రగణపతి వ్రతము.
శ్రీకృష్ణ చైతన్యస్వామి జయంతి

**మార్చి**

01. శ్రీకంఠ జయంతి,
07. మత్రతయ ఆమలక ఏకాదశి
09. కామ దహనము
10. హెూళికా పూర్ణిమ
12. వసంతోత్సవము
14. మీనసంక్రమణము
16. పొట్టి శ్రీరాములు జయంతి
20. మేషాయనము
22. మత్రతయ ఏకాదశి
24. మాసశివరాత్రి,
గురుమౌఢ్యమి ప్రారంభము
26.క్రొత్త అమావాస్య

# ఉపయుక్త విషయములు

## నామనక్షత్ర సందేహ వివరణ

| నామము | నక్షత్రము | పాదము | నామము | నక్షత్రము | పాదము |
|---|---|---|---|---|---|
| కృష్ణుడు | మృగశిర | 3 | క్షేముడు | పునర్వసు | 1 |
| హృష్ణుడు | స్వాతి | 1 | ఫణి | ఉ.ఫ. | 3 |
| శ్రీధరుడు | చిత్త | 4 | ద్రోణ, దౌపది | స్వాతి | 3 |
| క్షేత్రపాలుడు | హస్త | 2 | భీముడు | మూల | 4 |
| జ్ఞానుడు | ఆర్ద్ర | 3 | భైరవుడు | పూషా | 3 |

శ్లో॥ నరస్యద్వయనామాచ, ఆదినామమ్ విసర్జయేత్ ।
అంత్య నామం గృహీత్వాచ, ఇత్యేతత్ లగ్న కారణమ్ ॥

విశేష నామములు గలవారు ఆదినామముల విసర్జింపవలయును. అనగా వీర వెంకట సత్యనారాయణ అనునామమునకు వ్యవహార నామమగు సత్య నారాయణ గ్రహించవలెను. అనగా వ్యవహారనామముమాత్రము గ్రహించవలెను.

## జననవిషయమై దుష్టతిథి వార నక్షత్రవములు

అశ్వ1వ పాదం, మఘ 1 వ పాదం, రేవతి 4వ పాదం శిశు గండం ; భరణి 3 వ పాదం, కృత్తిక 2వ పాదం, పుష్య 2,3 వ పాదములు, మఘ 3 వ పాదం, ఉత్తర1వ పాదం (అనికొందరు) , ఉత్తరాషాఢ 1 వ పాదం, హస్త 3 వ పాదం, చిత్ర 1-2 పాదములు, పూర్వాషాఢ 3వ పాదం ఇవి పురుషుడైన పితృ గండము, స్త్రీ అయినచో మాతృగండము కలుగును.; రోహిణి 1-2 పాదములు తల్లికిని మేనమామకును, 3-4 పాదములు కేవలం మేనమామకును గండము. 1 వ పాదము దోషముకాదు. ఆశ్లేష 2 వ పాదం ధనహాని, 3 వ పాదం తల్లికి గండం, 4 వ పాదం తండ్రికి గండము. మూల 1 వ పాదములో మొదటి సగము మిక్కిలిదోషమైనది. 2 వ పాదం తండ్రికి, 3 వపాదం ధనమునకు దోషము. నాల్గవ పాదం దోషములేదు. జ్యేష్ఠయొక్క నక్షత్రాద్యంతమును 11 చే భాగించి అందే భాగమైనదో ఆ భాగము యొక్క ఫలము తెలుసు కొనవలయును. 1 వ భాగం మాతామహిగండం, 2 వ భాగం మతామహ గండం, 3 వ భాగం మేనమామకు గండం, 4 వ భాగం తల్లికి గండం, 5 వ భాగం శిశు గండం, 6 వ భాగం గోత్ర నాశనం, 7 వ భాగం ఉభయకుల నాశనం, 8 వ భాగం సోదర గండం, 9 వ భాగం శ్వశుర గండం, 10 వ భాగం సర్వ నాశనం, 11వ భాగం మిక్కిలి దుష్టము.; విశాఖ పురుషుడైన మేనమామకు గండం, స్త్రీ శిశువైన భర్తయొక్క సోదరునకు గండం, మీన మేషములకు, కర్కాట సింహములకు, వృశ్చిక ధనుస్సు లకు సంధి అర ఘడియ ప్రబల శిశుగండం. పంచమీ షష్టికిని, దశమైకాదశులకు ను, పూర్ణిమా అమా ప్రతిపత్తులకు సంధి 2 ఘడియలు శిశుగండము.



వ్యతీపాత, వైధృతి, పరిఘ, వ్యఘ్ర, వైప్రలకును మహాపాతలు, సంధ్యాకాలము అమావాస్య లకు; తల్లి, తండ్రి, సోదరుడు వీరి నక్షత్రములైనను; గ్రహణకాలమైనను గూడా శాంతి చేయవలెను. పైన చెప్పబడిన నక్షత్రములందు ఆయాపాదములలో జననమైనచో సంపూర్ణ మహాశాంతియు, ఇతర పాదములందైన సామాన్య శాంతియు చేసుకొనవలెను.

## గండ పురుష స్థితి

ఆషాఢభాద్రపద ఆశ్వయుజ మాఘమాసములందు స్వర్గలోకమునను, చైత్ర శ్రావణ కార్తీక పౌష మాసములందు భూలోకంబునను, వైశాఖ జ్యేష్ఠ మార్గశిర ఫాల్గుణ మాసములందు పాతాళంబునను గండ పురుషుడు నివసించును. గండపురుషుడు భూమియందు నివసించు కాలమున దుష్టనక్షత్రం మొదలగువాటియందు రజస్వల, జననమైనచో విశేష దోషం కలదు. ఇతర లోకములందున్నప్పుడు దుష్ట కాలమందు జననాదికమైనను కొంచెం దోషం తగ్గును.

## నవగ్రహ శాంతి ( జన్మ లేక నామరాశినుండి)

1. సూర్యుడు 1-2-4-5-7-12 స్థానవములలో నున్నప్పుడు పరమ శివుని పూజించినా, సూర్యనమస్కారాలు చేసినను, ఎర్రనిపూవులచే అర్చనలు చేయించినను, ఎర్రబట్టలు ధరించినను, ఎర్రఆవు లేక గోధుమలను దానం చేసినను దోష నివృత్తి అగును.

2. చంద్రుడు 2-4-7-12 స్థానములలో నున్నప్పుడు అమ్మవారిపూజ చేసినను, శ్వేత పుష్పములచే పూజించినను, శ్వేతవస్త్రములు, ముత్యములు ధరించినను, శంఖము లేక బియ్యము దానం చేసినను దోష నివృత్తి యగును.

3. కుజుడు 2-4-5-7-9-10-12 స్థానములలో నున్నప్పుడు సుబ్రహ్మణ్యుడు లేక కాళిని పూజించినను, రక్త వస్త్రం లేక పగడమును ధరించినను, పగడములేక ఎర్రనికందులు దానము చేసినను దోష నివృత్తి అగును.

4. బుధుడు 1-3-4-5-7-9-12 స్థానాలలో నున్నప్పుడు (విష్ణువు) రావాది విశ్వావతార మూర్తులను పూజించినను, పీతాంబరం, మకరతం వీటిని ధరించినను, సువర్ణం లేక పెసలు దానం చేసినను దోష నివృత్తి యగును.

5. గురువు 1-3-4-6-8-10-12 స్థానాలలోనుండిన దక్షిణామూర్తిని పూజించినను, పుష్యరాగం ధరించినను, పసుపు వస్త్రములేక శనగలు దానం చేసినను దోషనివృత్తి యగును.

6. శుక్రుడు 9-3-8 స్థానాలలో నున్నప్పుడు పార్వతిని లేక లక్ష్మిని పూజించినను, శ్వేత వస్త్రము లేక వజ్రము ధరించినను;వెండి, తెల్లటి గుర్రము లేక బొబ్బర్లు దానము చేసినను దోష నివృత్తి యగును.

7. శని 1-2-4-5-8-7-9-10-12 స్థానములలో నున్నప్పుడు శాస్తా (అయ్యప్ప)ను పూజించినను, నల్లని వస్త్రము, ఇంద్ర నీలమును ధరించినను, నల్లని ఆవు లేక నువ్వులు దానము చేసినను దోషనివృత్తి యగును.

8. రాహువు 1-2-4-5-7-8-10-12 స్థానములలో నున్నప్పుడు దుర్గను పూజించినను, గోమేదికము ధరించినను, కత్తి , ఇనుము లేక మినుములు దానము చేసినను దోషనివృత్తి యగును.

9. కేతువు 1-2-4-5-7-9-10 స్థానములలో నున్నప్పుడు గణపతిని పూజించినను, వైఢూర్యమును ధరించినను లేదా వైఢూర్యమును దానము చేసినను దోష నివృత్తి అగును.

**గమనిక:- దానముల విషయమున సద్బ్రాహ్మణుడు దొరకని పక్షమున ఆ ధాన్యమును ఆవుకు ఆహారముగానిచ్చుట, అగ్నిహోత్రునకు సమర్పించుట, ప్రవాహపు నీటి యందు వదులుట - క్రమంగా ఫలముల నొసగునని వంశానుగత గురువాక్యము. జపతపాదులు చేయని వృత్తి పురోహితులకు దానము చేసిన శాంతి కలుగదు.**

## ఏకోదర సంస్కార నిర్ణయం

అన్నదమ్ములకు సమానమైన సంస్కారము ఏక ముహూర్తములో చేయకూడదు. 6 మాసములు వ్యత్యాసముంచుట శ్రేష్టము. సంవత్సరనామం మారిన మధ్యమము. అయన ఋతు భేదములు అధమము. అన్నా చెల్లెళ్ళకు ఏక ముహూర్తమున సమాన స్థాయి సంస్కారములు జరుపవచ్చును. తన కుమార్తెనిచ్చిన గృహమునుండి కన్యను తేరాదు. పెద్దబిడ్డలకంటేముందు పుత్రికా వివాహం గాని, పుత్రోపనయనం గాని చేయకూడదు. పుత్రికా వివాహానంతరం పుత్రోపనయనము సర్వస్య శుభకరము.

## వివాహ విషయం

శుభకార్యములన్నింటిలోను వివాహము చాలముఖ్యమైనది. దంపతులు ఒకరి నొకరు చూచుకున్న వేళావిశేషములను బట్టి శుభాశుభ ఫలితములు జరుగుచుండును. వారిద్దరి జన్మలేక నామ నక్షత్రములను బట్టి జాతక కుండలులనుబట్టియు మంచిచెడ్డలను తెలిసికొని వివాహం చేయుట శుభము. ముఖ్యముగా కుజదోషం చూడదగినది.

## వివాహమునకు శుక్రదోషం

శుక్రుడు జాతకమునకు కళత్ర కారకుడగును. స్త్రీ జాతకమునకు భర్త కారకుడగును. అందుచే 6-8-12 స్థానములందుండి పాపగ్రహ సంబంధము గాని, దృష్టి గాని కలిగి పురుష జాతకమందున్నచో స్త్రీకిని, స్త్రీ జాతకమందున్నచో పురుషునకును దోషము కలుగును.

## జన్మతార నామతార వివరణ

వరుని జన్మనక్షత్రమునూ, కన్యాజన్మ నక్షత్రమునూ చూచుట శ్రేష్టము. కన్యకు జన్మనక్షత్రము లేనిచో, వరుని జన్మనక్షత్రము కన్యయొక్క నామనక్షత్రము చూడవచ్చును. వధూవరులకిరువురకు జన్మనక్షత్రములు లేనిచో నామ నక్షత్రముల తోనే చూడవచ్చును. ఇదియును విరుద్ధమైనచో కన్యకు మరల నామ కరణము చేయవలయునే గాని, తారాబలమున భిన్నత రాకూడదు. కొన్ని ప్రదేశములందు తత్కాలముగా కన్య నక్షత్రమును మార్చుచున్నారు. ఇది శాస్త్ర విరుద్ధము.

## జన్మరాశి - నామరాశుల నుపయోగించు సమయములు

దేశ, గ్రహ, గృహ, వ్యవహార, దాన, మంత్ర, రాజసేవ, యుద్ధ, పునర్వివాహా దులందు అన్నింటికినీ నామరాశియు - వివాహాది సమస్త శుభకార్యాలన్నింటికినీ జన్మరాశియు శ్రేష్టమని చెప్పబడినది.



## రాశి కూటములు చూచే విధము

స్త్రీ రాశికి పురుష రాశికి 2-12 మృత్యువు; 12-1 అయిష్టం; 3-11 సౌఖ్యం; 11-3 దుఃఖం; 4-10 విరోధము; 4-6 సౌభాగ్యం; 6-5 వైధవ్యము; 6-8 కలహము; 8-6 ప్రీతి; 7-7 శుభము. ఈ రీతిగా చూడవలెను.

## యోని కూటమునందలి వైరవర్గ జంతువులు

కుక్క - లేడి, పాము- ముంగీస, సింహము - గజము, కోతి - మేక, గుర్రము - యెనుబోతు, గోవు - వ్యాఘ్రం, పిల్లి - ఎలుక ఇవి పరస్పర విరోధ జంతువులు.

## వివాహమునకుపయుక్తములగు రాశి కూటాదుల విషయాలు

రాశికూటాదులు స్త్రీ రాశి మొదలు కొని పురుషరాశి వరకు లెక్కింపవలెను. పనికి వచ్చే మీన - మేష, వృష- మిథు, కన్యా- తుల, వృశ్చి- ధను, మక- కుంభ, వీటిలో 2-12 అయినను శుభము.

ఏకాదశ త్రికాలకు: కర్కాట - వృష, మిథు- కన్య, సింహ- వృశ్చి, తుల- మక, ధను- మీనం శుభాలు మిగిలినవి అశుభాలు.

నవపంచమములకుః - మిథు- కుంభ, మకర- కన్య, మీన - వృశ్చిక ములు శుభాలు మిగిలినవి అశుభాలు

షష్ఠాష్టకములకుః- మేష-వృశ్చిక, కటక- ధను, సింహ- మీనం, మక- మిథు, తుల- వృషభము ఇవి శుభములు. కన్య, - కుంభ, సింహ- మీనములు అశుభములు.

సమసప్తకములకుః- సింహ - కుంభ, మకర - కర్కాటకములు తప్ప మిగిలినవి శుభములు.

ఏక నక్షత్ర విషయములు:- భర, మృగ, ఆశ్లే, హస్త, ఉ.షాఢ, శత, ఈ నక్షత్రములు దంపతులకు ఒకటైన పనికిరావు.

కృత్తి, రోహి, ఆర్ద్ర, మఖ, పుష్య, చిత్త, శ్రవ, ఉ.భా. రేవ ఇవి దంపతులకు ఏకమైన శుభం. మిగిలినవి మధ్యమము. దంపతులది ఒకే రాశి అయినపుడు భిన్నపాదం భిన్న నక్షత్రం అయిన శుభము.

ఏక నాడీ విషయం ; ఉత్తర, పూ. భా, పున, ఆర్ద్ర, మూల, అశ్విని ఈ నక్షత్రములందు ఏక నాడి దోషం లేదు.

మధ్యనాడి విషయం - పూ.షా, అనూ, ధని, పుష్య, చిత్ర, పూ. ఫ, మృగ ఇవి మధ్యనాడి ఐనను దోషం లేదు.

అంత్యనాడి విషయం - ఉ.భా, రేవ, రోహి, స్వాతి, విశా, ఆర్ద్ర ఈ నక్షత్రాలందు అంత్యనాడి దోషం లేదు.

పనికివచ్చే రాక్షస గణ నక్షత్రములు - ఆశ్లే, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, మూల, శతభిషం ఈ నక్షత్రములలో స్త్రీ రాక్షసగణమైనను దోషం లేదు. ఏకాధిపత్యం అయినను, రాశి యోని,

గ్రహ మైత్రి, నాడి ఇవి సహజంగా శుభంగా నున్నను స్త్రీలకు గల రాక్షసగణం దోషం లేదు. పరిహారం పనికివచ్చురాశి కూటాదులకు (16) గుణాలకన్న అధికంగా నున్న శుభము.

## బల్లిపడుట, తొండప్రాకుటవలన ఫలితములు

బ్రహ్మస్థానమున రాజ్యం, లలాటమున చెవుల యందు లాభం, నేత్రములయందు నాశిక యందు శుభము, వామదేహమున భీతి, భ్రూమధ్యమున కలహం, కంఠమున వ్యసనము, వెన్నెముక యందు మోసము, వీపు కుడి వైపున సుఖం, ఎడమవైపున రోగం, కుడిచేతి యొక్క భుజశిరస్సున శత్రు భయము, మిగిలిన చోట ధన నాశనము, హృదయము గౌరవం, దక్షిణ హస్తమున సౌభాగ్యము, వామ హస్తమున కీర్తి, కుడిప్రక్క సుఖము, ఎడమ ప్రక్క పీడ, ఉదరమున ధాన్య లాభం దీని కుడి ప్రక్క పుత్రలబ్ధి, ఎడమ ప్రక్క శిశు పీడ; నాభి యందిష్ట ప్రాప్తి, పొత్తి కడుపున వస్త్రలాభం, వామ కటి యందు దుఃఖం, కుడితొడ, కుడి మోకాలు కుడి పిక్కయందు దుఃఖము, కుడి పిరుదున ధన వృద్ధి, ఎడమ పిరుదున స్త్రీ వియోగము, కుడి చీలమండలయందు లాభము, ఎడమ చీలమండలయందు హాని, పాదములయందు ప్రయాణము కలుగును. పురుషులకు కుడి భాగములందలి ఫలితము, స్త్రీలకు ఎడమ భాగము నందు ఫలితములుకలుగును.

## సుశకునములు

శుభప్రదములు - ఇద్దరు బ్రాహ్మణులు, ఒక శూద్రుడు, ఉత్తమ విప్రుడు, క్షత్రియుడు, అశ్వము, గజము, గో వృషభములు, జలచరములు, వేశ్య, సువాసిని, స్త్రీ, దంపతులు, ఉదకము, పాలు, పెరుగు, నెయ్యి, పూవులు, పండ్లు, రత్నములు, భక్ష్యములు, చెరకు, మాంసము, ఛత్రము, చామరం, అద్దము, వీణ, మద్దెల, శంఖము, మంగళధ్వని, గోమయం, చిత్తడి మట్టి, శుభవాక్య శ్రవణం, పాలపిట్ట, బర్రె, కోడి, కాకి, నెమలి, భరద్వాజము, ముంగీస, మేక ఇవి యెడమ నుండి వెళ్ళుట మంచిది.

## సుస్వప్నములు

మేడను, పర్వతము, వృక్షమును, రథమును, గుర్రమును, ఏనుగునుచూచుట ఎక్కుట; ప్రభువు, బంగారం, ఎద్దు, ఆవు, అన్నము, గోక్షీరము, గోఘృతము, కన్య, బ్రాహ్మణులు, వేశ్య, నటుడు, రత్నములు, ముత్యాలు, శంఖము, దేవతా విగ్రహాలు, జలజంతువులు, కోడి, కొంగ, చందనం, అగ్ని, పూలచెట్టు, మామిడి, ఉసిరిక మొదలగు ఫలవృక్షములు; మారేడు, పుణ్య స్థలములు చూచుట; పాలు, పెరుగు, తేనె, నేయి, భక్ష్యములు, మనుష్య మాంసము, పక్షిమాంసము భక్షించుట; పీతాంబరము, పీతమాల్యములుగల స్త్రీ కౌగిలించు కొనుట స్వప్నమైనచో ఆరోగ్యము ధనము, భూమి, సంతతి, స్త్రీ లాభము మొదలగు శుభములు కలుగును. తెలుపు, పచ్చని వస్తువులు చూచుట మంచిది.



## శుభ ముహూర్త విషయములు

ఉయ్యాలలో వేయుటకు :- 2, 3, 5, 7, 10, 13 తిథులు ; సోమ, బుధ, గురు, శుక్ర వారాలు,; అశ్విని, రోహి, మృగ, పుష్య, ఉత్తర, హస్త, చిత్త, అనూ, ఉ.షాఢ, ఉ.భా, రేవతి నక్షత్రములు. ; వృషభ, మిథున, కర్కాటక, కన్య, తుల, ధను, మీన లగ్నములు, అష్టమశుద్ధి చూడవలెను.

నామకరణము :- 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు ; అశ్విని, రోహి, పున, పుష్య, ఉత్తర, హస్త, స్వాతి, అనూ, ఉ.షా, శ్రవ, ధని, శత, ఉ.భా, నక్షత్రాలు; సోమ, బుధ, గురు, శుక్ర వారాలు; వృషభ, మిథున, కర్కాట, కన్య, తులా, ధను, మీన లగ్నములు, పక్ష ఛిద్రము గాని దినములు, అష్టమ శుద్ధి చూడవలెను.

అన్నప్రాశనం :- 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు; సోమ, బుధ, గురు, శుక్రవారాలు; అశ్విని, రోహి, మృగ, పున, పుష్య, ఉత్త, హస్త, చిత్త, స్వాతి, అనూ, ఉ.షా, శ్రవ, ధని, శత, ఉ.భా, రేవతి నక్షత్రములు ; వృషభ, మిథున, కన్యా, ధను, మీన లగ్నములు, లగ్న శుద్ధి, దశమ శుద్ధి కావలెను. పురుషులకు సరిమాసం, స్త్రీలకు బేసి మాసం చూడవలెను.

చెవులు కుట్టులకు :- 2, 3, 5, 7, 10,13 తిథులు; సోమ, బుధ, గురు, శుక్ర వారాలు; అశ్విని, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, శ్రవ, ధని, శత, రేవతి నక్షత్రములు; వృష, మిథున, కర్కాట, కన్య, తుల, ధను, మీన లగ్నములు, అష్టమ శుద్ధి, జన్మాది 6, 7, 8 మాసములందు జరిపించవలెను.

కేశ ఖండనము:- 2, 3, 5, 7, 10, 13 తిథులు ; సోమ, బుధ, గురు, శుక్ర వారములు; అశ్విని, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, శ్రవ, ధని, శత, రేవతి నక్షత్రములు ; వృషభ, మిథున, కర్కా, కన్య, తుల, ధను, మీన లగ్నములు, అష్టమ శుద్ధి ఉండాలి. ఉత్తరాయణమున పూర్వాహ్ణమున చేయాలి.

ముక్కు కుట్టుటకు ;- అశ్విని, మృగ, పున, పుష్య, ఉత్త, చిత్త, స్వాతి, ధని, శ్రవ, ఉ.భా రేవతి నక్షత్రములందును, శుక్లపక్షమునందు ఉదయకాలమున మంచిది.

అక్షరాభ్యాసం :- 2, 3, 5, 7, 10, 13 తిథులు; సోమ, బుధ, గురు, శుక్ర వారములు; అశ్విని, మృగ, పున, పుష్య, ఆర్ద్ర, స్వాతి, అనూ, శ్రవ, రేవతి నక్షత్ర ములు. మేష, కర్కట, తుల, మకర లగ్నములు, అష్టమ శుద్ధి, ఉత్తరాయణంలోను, 5 సంవత్సరాలలోపు చేయాలి. గురు శుక్ర మూఢములందు చేయరాదు.

విద్యాభ్యాసం:-2,3,5,7,10 తిథులు; సోమ, బుధ, గురు, శుక్ర వారములు; అశ్విని, మృగ, పున, పుష్య, ఆర్ద్ర, హస్త, చిత్త, స్వాతి, మూల, శ్రవ, రేవతి నక్షత్రములు; మేష, కర్క, తుల, మకర, మీన లగ్నములు, అష్టమ శుద్ధి, అనధ్యాయ రహితము, పగటి భాగమునందు చేయాలి.

**ఉపనయనము:-** శుక్లపక్షమున 2, 3, 5, 7, 10, కృష్ణ పక్షమున 2, 3,5 తిథులు; సోమ, బుధ, గురు, శుక్రవారములు ; అశ్విని, రోహి, మృగ, పున, పుష్య, ఉ.ఫ. చిత్త, స్వాతి, అనూ, ఉ.షా, శ్రవ, ధని, శత, ఉ. భా, రేవతి నక్షత్రములు; వృష, మిథు, కర్క, కన్య, ధను, మీనలగ్నములు, అష్టమశుద్ధి చూడాలి. అనధ్యయన ముహూర్త కూడదు. మీనచైత్రం దీనికి మంచిది. గ్రహబలం చాలా ముఖ్యం. తల్లిదండ్రులకు తారాబలం చూడాలి. కేంద్రములందు పాప గ్రహములుండరాదు.

**యజ్ఞోప వీత ధారణకు :-** (జంధ్యము వేసుకొనుట) శ్రావణ పౌర్ణమికి, గ్రహణం విడిచిన తరువాత, పురిటిమైల శుద్ధి అయిన తరువాత, అశౌచముల తరువాత క్రొత్త యజ్ఞోపవీతము (జంధ్యము) ధరించాలి.

**వివాహ నిశ్చయతాంబూలములకు :-** 2, 3, 5, 7, 10, 13 ఉభయ పక్షములందు, పూర్ణిమ తిథులలో; ఆది, బుధ, గురు, శుక్ర, శని వారములందును ; అశ్వని, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, అనూ, శ్రవ, ధనిష్ట, శతభి, రేవతి నక్షత్రములందునూ, లగ్నమునకు 5, 9 స్థానములందు పాప గ్రహములు లేకుండా చూసుకొనవలెను.

**పెండ్లికుమారుని, పెండ్లికుమార్తెను చేయుటకు :-** 2, 3, 5, 7, 10, 13 తిథులు; సోమ, బుధ, గురు, శుక్ర, శనివారములు ; అశ్విని, పున, పుష్య, చిత్త, స్వాతి, శ్రవ, ధనిష్ట నక్షత్రములు, 5, 9 స్థానాలందు పాపగ్రహములు లేకుండా చూసుకొనవలెను.

**వివాహము:-** మాఘ, ఫాల్గుణ, వైశాఖ, జ్యేష్ఠ, మార్గశిర, కార్తిక మాసములు మంచివి. సూర్యుడు చైత్ర మాసమున మేష రాశియందుండగా చేయవచ్చును. 2,3,5,7,10, 13 తిథులు; బుధ, గురు, శుక్రవారములు ; రోహి, మృగ, ఉత్త, హస్త, స్వాతి, అనూ, మూల, ఉ.షా, ఉ.భా, రేవతి నక్షత్రములు; వృష మిథు, కర్కాట, తుల, కన్య, ధను, మీన లగ్నములు; సప్తమ స్థానమునందు ఏ గ్రహము ఉండరాదు. అష్టమ శుద్ధిని కూడా చూడాలి. పెండ్లిపీట అయిదంగుళాల వెడల్పు, 6 అంగుళాల ఎత్తు , 37 అంగుళాలు పొడవు ఉండవలెను. ఇది ప్రాంతీయ ఆచారములపై ఆధారపడియున్నది.

**గర్భాధానం :-** 2, 3, 5, 7, 10, 13 తిథులు, సోమ, బుధ, గురు, శుక్రవారములు; రోహి, మృగ, పున, పుష్య, ఉత్త, హస్త, చిత్త, స్వాతి, అనూ, ఉ.షా, శ్రవ, ధని, శత, ఉ. భా, నక్షత్రములు; వృష, కర్కా, తుల, కన్య, ధను, మీన లగ్నములు, లగ్న శుద్ధి, అష్టమ శుద్ధి చూడాలి. పంచ పర్వములు, ప్రతిదినసంధ్యాసమయము, శ్రాద్ధదినములు కూడవు. వివాహం అయిన 16 రోజులలోపున చేసిన యెడల ముహూర్తంతో పనిలేదు.

**నిషేకము:-** (వర్తమాన పరిస్థితులలో అవసరంలేదు) 2, 3, 5, 7, 10, 13 తిథులు; సోమ, బుధ, గురు, శుక్రవారములు;, అశ్విని, రోహి, ఉత్త, హస్త, అనూ, ఉ.షా. శ్రవ, శత, ఉ. భా, రేవతి నక్షత్రములు ; వృషభ, మిథున, కర్కట, తుల, ధను, మీన లగ్నములు, లగ్న శుద్ధి ఉండాలి. పంచపర్వ, వ్రత దినములు, సంధ్యాసమయంకూడదు. నిషేకము అనగా వయస్సు కలిగి రజస్వల ఆలస్యముగా నున్నచో (కానిచో) భర్తతోకలియుట నిషేకము అందురు.



**పుంసవనము - సీమంతములు :-** 2, 3, 5, 7,10, 13, 15, తిథులు ; బుధ, గురు, శుక్ర వారములు ; రోహి, హస్త, చిత్త, స్వాతి, పుష్య, ఉత్తరాత్రయం, పున, అనూ, శ్రవ, ధని, శత, రేవతినక్షత్రములు ; మేష, మిథు, ధను, కుంభ, తులా లగ్నములు, పుంసవనమునకు 3వ నెల, సీమంతమునకు 4, 6, 8 నెలలు మంచివి.

**గృహారంభము:-** (శంకుస్థాపన) 3, 5, 7, 11, 15 తిథులు ; బుధ, గురు, శుక్ర వారములందునూ, రోహి, మృగ, పుష్య, హస్త, చిత్త, స్వాతి, అనూ, ఉ.షా, శ్రవ, ధని, శత, ఉ. భా, రేవతి నక్షత్రములందునూ ; వృష, సింహ, వృశ్చిక, కుంభలగ్నములు మంచివి. మేష, కర్కా, తుల, మకరములు మధ్యమము, మిథు , కన్య, ధను, మీన రాశులు లగ్నమునకు చతుర్థ, అష్టమరాశులుగా ఉండాలి. చతుర్థ అష్టమములందు పాప గ్రహములుండరాదు. ఉదయము ఒకటి రెండుఝామలు, రాత్రియందు మూడునాలుగు ఝాములు ఉత్తమములు. వృషభ, కలశచక్ర శుద్ధులు కూడచూడవలెను.

**గృహ ప్రవేశము:-** 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులందునూ; బుధ, గురు, శుక్ర వారములందునూ; రోహి, మృగ, ఉత్త, చిత్త, అనూ, ఉ.షా, ధని, శత, ఉ. భా, రేవతి నక్షత్రములందునూ; వృష, మిథు, కన్య, ధను, మీనలగ్నములు మరియు స్థిర లగ్నములయినచో అత్యంత బలీయము. చతుర్థ అష్టమ శుద్ధులు వృషభ - కలశ శుద్ధి ఉండాలి.

**యాత్రలు చేయుటకు :-** 2, 3, 5, 7,10,13 తిథులు; సోమ, బుధ, గురు, శుక్రవారములు; అశ్విని, మృగ, పున, పుష్య, హస్త, అనూ, శ్రవ, ధని, రేవతి నక్షత్రములు; మేష, వృషభ, కర్కా, కన్య, తుల; ధను, మకరలగ్నములు మంచివి. మరియు ప్రయాణమునకు మంచి శకున బలము, తారాబలము, పంచమ శుద్ధి, వార శూల, పంచక రహిత, గౌరీ పంచాంగం, ఆనందాది యోగములు తప్పక చూడాలి.

**ఉద్యోగములో చేరుటకు :-** 2, 3, 5, 7, 13 తిథులు; అశ్వి, పున, పుష్య, హస్త, చిత్త, అనూ, రేవతి నక్షత్రములు ; బుధ, గురు, శుక్రవారములు; శుభలగ్నములందునూ, రవి 10లో, కుజుడు 11 లలో ఉండిన చాలా మంచిది. ఉద్యోగాదులందు స్థిరత్వము పొందును.





# స్త్రీ లకు సంబంధించిన శుభ ముహూర్త విషయములు



**అత్తవారింటికి వెళ్ళుటకు :-** 2, 3, 5, 7, 10, 13 తిథులు; సోమ, బుధ, గురు, శుక్ర వారములు; అశ్వి, రోహి, మృగ, పుష్య, ఉత్తరాత్రయం, మఖ, హస్త, చిత్త, స్వాతి, అనూ, మూల, ధని, రేవనక్షత్రములు; వృష, మిథు, కర్కా, సింహ, వృశ్చిక, ధను, కుంభ, మీనలగ్నములు; ద్వాదశ శుద్ధి, బేసిమాసములు, వివాహం జరిగిన 16 రోజులలో తిథి వార నక్షత్రములు పాటించక అత్తవారింటికి గృహప్రవేశము చేయవచ్చును. ( ఆది, శుక్ర వారములు అత్తవారింటికి వెళ్ళకూడదు)

**గాజులు ధరించుటకు:-** గర్భవతి అయిన స్త్రీకి (3,5,7) బేసి మాసము అందునూ; 2,3,5,7,11 తిథులందు; బుధ, గురువారవములందు; మంచి నక్షత్రవములందు; వర్జ్య దుర్ముహూర్తాలు లేకుండ గాజులు వేయించుట మంచిది.

**గర్భవతి అయిన స్త్రీని పురిటికి తీసుకొని వచ్చుటకు:-** తిథి, వార, నక్షత్రములు మంచివి చూసి వర్జ్య దుర్ముహూర్తములు లేకుండా 7 వ మాసము లేదా 9 వ మాసము రాగానే పురిటికి పుట్టింటికి తీసుకురావలెను. మొదటి పురుడు, రెండవ పురుడు పుట్టింట్లో పోయాలి. మూడవ పురుడు పుట్టింట్లో పోయరాదు. శిశు నష్టంకలుగును కావున అత్తవారింట్లో పోయాలి. ప్రస్తుత కాలములో ఇద్దరే పిల్లలు కలుగుతున్నారుకావున ఈ ఆచారము పరిగణనలో లేదు.

**బాలింతరాలికి పథ్యము:-** బుధ, గురు, శుక్రవారములు; రోహి, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, అనూ, ఉత్త, ఉ.షాఢ, ధనిష్ఠ, శత, ఉ.భా, రేవనక్షత్రములు;, 2, 3, 5, 7, 9, 10,11,13,15 తిథులందునూ; దశమమందు పాప గ్రహము లేకుండా చూడాలి.

**బాలింత రాలికి స్నానమునకు:-** అశ్వి, రోహి, మృగ, ఉత్త, స్వాతి, అనూ, ఉ.షా, ఉ.భా, రేవతీ నక్షత్రములందు; ఆది, మంగళ, బుధ, గురువారములు మంచివి. 7 వ రోజునగాని, 11వ రోజునగాని స్నానను చేయించవలెను.

**బాలింతరాలు నీళ్ళు తోడుటకు :-** 2, 5, 7, 9, 10, 11,13 తిథులు; మృగ, పున, పుష్య, హస్త, అనూ, మూల, శ్రవ నక్షత్రములు ; సోమ, బుధ, గురువారములు ; 21, 23, 25, 27, 29 రోజులలో బాలింతరాలుచే జలపూజ చేయించి నీళ్ళు తోడించవలెను.

**శిశువునకు మొలత్రాడు కట్టుటకు :-** పురిటి శుద్ధి రోజున మంచిది. అశ్వి, రోహి, మృగ, పుష్య, ఉత్త, హస్త, అనూ, ఉ.షా, ఉ.భా, రేవతీ నక్షత్రములు; మంగళ వారము మంచిది కాదు. వెండి లేదా బంగారపు మొలత్రాడు 5 వ నెలలో కట్టాలి. మొలత్రాడునకు రాగి, లేదా నల్లపూసలు కట్టినగాని శిశువు పురిటి సమయమున తీసిన బొడ్డుగానికట్టిన దోషములు, దృష్టి దోషాలు తొలగి పోవును.

**శిశువునకు సూర్య చంద్రుల దర్శనం:-** శిశువు జన్మించిన మాసంలో మంచి తిథి, వార, నక్షత్రములలో సూర్య, చంద్రులనుశిశువునకు చూపించాలి.



**బిడ్డను ఇల్లు కదుపుటకు :-** 2, 3, 5, 10, 11, 13 తిథులు; అశ్వి, రోహి, పున, పుష్య, మృగ, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, అనూ, శ్రవ, ధని, శత, రేవనక్షత్రములు; మేష, వృష, కర్కా, తుల, ధను, మీన లగ్నములు; సోమ, బుధ, గురు, శుక్రవారములు శుభం ; శిశువుపుట్టిన 3 వ నెలలో ఇంటి నుండి వెళ్ళి ఒక రాత్రి అయిన బయట నిద్దుర చేయాలి.

**పురుడు తరువాత శిశువుతో అత్తవారింటికి వెళ్ళుటకు :-** శిశువుకు 3 వ నెల గాని, 5 వ నెలగాని ఆపై 7, 9, 11 నెలల్లో అత్తవారింటికి వెళ్ళవచ్చును. వర్తమానములో కొంతమంది 1 వ నెలలోనే పంపించుచున్నారు. అట్లు చేయుట వలన స్త్రీ యొక్క ఆరోగ్యము క్షీణించును. 2, 3, 4, 7,10,11,13 తిథులు; సోమ, బుధ, గురు, శనివారములు ; అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, మఖ, ఉత్త, హస్త, స్వాతి, అనూ, మూల, ఉ.షా, శ్రవ, శత, ఉ.భా, రేవ నక్షత్రములందును, తారాబలం, వారశూల, ఆనందాది యోగములు తప్పక చూడాలి. తారాబలము మాత్రం తల్లికి, శిశువునకు ఇద్దరకూ సరిపోవాలి. శూన్య మాసములు, గురు, శుక్ర మౌఢ్యములు పనికిరావు.

**స్త్రీలు ఆభరణములు, నూతన వస్త్రములు ధరించుటకు :-** అశ్వి, హస్త, చిత్త, విశా, స్వాతి, అనూ, ధనిష్ఠ, రేవనక్షత్రములందు; బుధ, గురు, శుక్ర వారములందు వెండి, బంగారు ఆభరణములు, వస్త్రములుధరించుటకు మంచిది. సోమ, మంగళవారములలో సౌభాగ్యవంతురాలైన స్త్రీ ఆభరణములు, నూతన వస్త్రములుధరించరాదు.

**గర్భిణీ స్త్రీ ధర్మములు :-** గర్భవతి అయిన స్త్రీలు ఈ క్రింది నియమాలు తప్పనిసరిగా పాటించవలెను. ఏనుగు, గుఱ్ఱపుబండి, పర్వతం, మేడలు ఎక్కరాదు. చెఱువులవద్ద, వటవృక్షములక్రింద కూర్చొనరాదు. సంధ్యాసమయమున భుజింప రాదు. దిగంబరులై స్నానము చేయతగదు. సంభోగ సుఖము కూడదు. గోళ్ళు గిల్లుకొనుట, కొరుకుట, ఆకులు తుంచుట, మాంసభక్షణ చేయరాదు. ముత్తైదువులను, బ్రాహ్మణులను పూజించాలి. భగవన్నామము జపించాలి. శుభప్రదమైన ఆభరణములు ధరించాలి. 4, 6,8 మాసములందు ప్రయాణము చేయరాదు. నిత్యము ఉప్పు, నూనె, బెల్లము, ఫలము దానము చేయవలెను. గర్భిణీ స్త్రీ ఏ వస్తువును కోరునో ఆ వస్తువును వెంటనే తెచ్చియివ్వవలెను.

సముద్ర స్నానం, చెట్లు నరుకుట, వివాహాదిశుభ కార్యములు చేయరాదు. అశౌచ వ్యక్తులను తాకరాదు. శోకించరాదు. సూర్య చంద్ర గ్రహణములందు మాత్రము చాలా జాగ్రత్తగా పరుండి మాత్రమే ఉండవలెను.









# విద్యావముహూర్త విషయంవములు



నాట్యము నేర్చుకొనుటకు :- సోమ, బుధ, గురు, శుక్రవారములు ; 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులందునూ; ఆరు, పుష్య, ఉత్త, అనూ, ఉ.షా, ధని, శత, ఉ.భా నక్షత్రములందునూ మంచిది.

వాయిద్యములు నేర్చుకొనుటకు :- బుధ, గురు, శుక్రవారములు; 5, 7, 10, 11 తిథులందునూ; రోహి, మృగ, స్వాతి, అనూ, ఉ.భా, రేవతి నక్షత్రము లందునూ; వృషభ, తులాలగ్నములు చాలా మంచివి. చతుర్థ శుద్ధి కావాలి.

సంగీత శిక్షణకు :- సోమ, గురు, శుక్రవారములు ; 3, 5, 7, 10, 11, 13 తిథులందునూ; అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, మఖ, ఉత్త, హస్త, స్వాతి, అనూ, శత, ఉ.భా. రేవతి నక్షత్రములందునను; వృష, మిథు, కర్కా, తుల, ధను, మీన లగ్నములు, ద్వితీయ చతుర్థ శుద్ధులు, లగ్నమునకు గురు, శుక్రుల దృష్టి కలిగి యుండుట మంచిది.

వ్యాకరణ విద్య:- సోమ, బుధ, గురు, శుక్రవారములు; అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, అనూనక్షత్రములందునూ వ్యాకరణమునేర్చుకొనుట ప్రారంభించుటకు శుభము.

గణిత విద్యారంభమునకు :- బుధ, గురువారములందు; రోహి, ఆరు, పుష్య, అనూ, శత, రేవతి నక్షత్రములందు గణితవిద్య నేర్చుకొనుట మంచిది.

వైద్య విద్యారంభమునకు :- ఆది, సోమ, మంగళవారములందు; అశ్వ, మృగ, ఆరు, పున, పుష్య, ఆశ్రే, హస్త, చిత్త, స్వాతి, అనూ, జ్యేష్ఠ, మూల, శ్రవ, ధని, శత, రేవతినక్షత్రములందు వైద్య విద్య నేర్చుకొనుటకు చాలమంచిది.

జ్యోతిశ్శాస్త్రము నేర్చుకొనుటకు :- బుధ, గురు, శుక్రవారములు ; 2, 3, 5, 7, 10, 11 తిథులు; రోహి, మృగ, పుష్య, ఉత్త, స్వాతి, అనూ, ఉ.భా, రేవతి నక్షత్రములందునూ; వృషభ, సింహ, తులా, వృశ్చిక, ధను, కుంభ, మీన లగ్నములందునూ; ద్వితీయము గాని కేంద్రకోణములందుగాని రవి బుధు లుండి లగ్నమునందు గురు శుక్రులుండగా ప్రారంభించిన మంచి వాక్శుద్ధి కలిగిన జ్యోతిష విద్యావేత్త విశారదుడు అగుననుటలో సందేహము లేదు.

శస్త్ర చికిత్సకు :- 4, 9, 14 తిథులందును, శుక్లపక్ష తిథులందునూ; మంగళవారము, జ్యేష్ఠ, ఆరుద్ర, ఆశ్రే, మూల, నక్షత్రములు; అష్టమశుద్ధిగల లగ్నమునందును; కుజుడు బలవంతుడై యుండగా ఆపరేషన్ చేయించుకొనుటకు మంచిది. చంద్రుడు జన్మరాశి యందుండగా, పాప నక్షత్రములందుండగానూ, చంద్ర స్థిత నక్షత్రములకు పాపగ్రహాక్రాంత ఉండగా ఆపరేషన్ చేయరాదు. తిరిగి అనారోగ్యం కలుగును.





# వ్యాపార సంబంధ ముహూర్త విషయంవములు



బట్టల దుకాణము ప్రారంభించుటకు :- 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు; సోమ, బుధ, గురు, శుక్రవారములు; అశ్వ, రోహి, పున, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూ, ఉ.షా, శ్రవ, ధని, శత, రేవతినక్షత్రములు మంచివి.

బంగారు, వెండి, నగల వ్యాపారమునకు :- 2, 3, 5, 7, 10, 11 తిథులందు; అశ్వ, రోహి, పున, పుష్య, ఉత్తర, హస్త, స్వాతి, చిత్త, అనూ, ఉ.షా, శ్రవ, ధని, శత, ఉ.భా. రేవతి నక్షత్రములందునూ; సోమ, బుధ, గురు, శుక్రవారములందు లాభదాయకముగా నుండును.

కిరాణా దుకాణం :- 2, 3, 5, 7, 10 తిథులందునూ; అశ్వ, రోహి, మృగ, పుష్య, అనూ, ఉ.భా, రేవతి నక్షత్రములందును; ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారములందు లాభదాయకము.

ఇనుము స్టీలు :- 2, 3, 5, 7, 10, 11, 13, శుక్ల పక్షమున 14వ తిథి మంచిది. శని, సోమ, బుధవారములు ; అశ్వ, రోహి, మృగ, పుష్య, హస్త, అనూ, ఉ.భా. నక్షత్రములు మంచివి.

ఎలక్ట్రికల్ షాపులు :- 2, 3, 5, 7, పూర్ణిమ తిథులందునూ, మంగళ, బుధ, శుక్రవారములలో ; రోహి, మృగ, పుష్య, హస్త, అనూ, ఉ.భా నక్షత్రములు మంచివి.

ఫ్యాన్సీ షాపులు :- 2, 3, 5, 7, 11 తిథులు; ఆది, మంగళ, బుధవారము లు ; రోహి, మృగ, ఉత్తర, చిత్త, స్వాతి, అనూ, ఉ.షా, ధనిష్ట నక్షత్రములు మంచివి.

పండ్ల దుకాణాలు :- 2, 3, 5, 7, 10, 11, 13 తిథులందు; సోమ, బుధ, గురు, శుక్ర వారాలు; రోహి, మృగ, పుష్య, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, పూ.భా, ఉ.భా, రేవతి నక్షత్రాదులందు లాభాదాయకం.

స్టేషనరీ దుకాణాలు :- 2, 3, 5, 7,10 తిథులందునూ ; సోమ, బుధ, గురు, శుక్రవారములు; రోహి, మృగ, హస్త, స్వాతి, అనూ, ఉ.షా. శ్రవ, ఉ.భాద్ర నక్షత్రములందును ప్రారంభించిన ధన లాభం కలుగును.

రేడియో, టీవి, వాచీ దుకాణములు :- 5, 7, 10 తిథులందునూ; సోమ, బుధ, గురు, శుక్రవారములు; రోహి, మృగ, పుష్య, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూ, ఉ.షా, శ్రవ, ఉ.భా, రేవతులు; లగ్న బలం కూడవుంటే లాభాదాయకము.

రైసు మిల్లు ప్రారంభించుటకు:- 2, 3, 5, 7, 10, 11, తిథులందునూ; అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, ఉత్తర, చిత్త, స్వాతి, అనూ, ఉ.షా. శ్రవ, ఉ.భా. రేవతి నక్షత్రములందు; స్థిర లగ్నములందును; చతుర్థ అష్టమ శుద్ధులు కావలెను.

**సినిమా వ్యాపారములు :-** ఫిలిం డిస్ట్రిబ్యూషన్ వ్యాపారమునకు - సోమ, బుధ, గురు, శుక్రవారములు ; 2, 3, 5, 7, 10, 11, 13, 15, తిథులందునూ; అశ్వ రోహి, మృగ, పున, పుష్య, ఉత్తర, స్వాతి, అనూ, ఉ.భా, రేవ నక్షత్రములందు; సప్తమశుద్ధి, శుక్రుడు బలీయముగా నున్న ఈ వ్యాపారమునందు అధిక లాభములు కలుగును.

**సైకిలు, మోటారు సైకిళ్ళ వ్యాపారమునకు :-** 2, 5, 7, 10 తిథులందు ; మంగళ, బుధ, గురు, శుక్రవారములందు; అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, స్వాతి, అనూ, మూల, ఉ.షా, శ్రవ, ధని, శత, ఉ.భా, రేవతి నక్షత్రములందు; స్థిర శుభ లగ్నములందు చేసిన శుభము. తృతీయ శుద్ధి మంచిది.

**హోటల్ వ్యాపారమునకు :-** 2, 3, 5, 7, 10 తిథులు; సోమ, బుధ, గురు, శుక్రవారము లందు; అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, అనూ, మూల, ఉ.షాఢ, శ్రవ, ధని, శత, ఉ.భా , రేవతి నక్షత్రములందు, తృతీయశుద్ధి కలిగిన లగ్నములలో హోటల్వ్యాపారము లాభదాయకము.

**చిట్ఫండ్ వ్యాపారమునకు :-** 3, 5, 7, 10, 11 తిథులు ; సోమ, బుధ, గురు, వారములందు; అశ్వ, రోహి, మృగ, ఉత్త, స్వాతి, అనూ, ఉ.షా, ఉ.భా, రేవతి నక్షత్రములందు; వృష, మిథు, కర్క, తులా, ధను, మీనలగ్నములు; సప్తమమందు బలీయమైన శుభగ్రహం ఉండుట చాలమంచిది.

**పుష్పముల దుకాణము :-** సోమ, గురు, శుక్రవారములు ; రోహి, మృగ, పుష్య, హస్త, చిత్త, స్వాతి, ఉ.షా, శ్రవ, శత, ఉ.భా, రేవతి నక్షత్రములు చాలమంచివి.

**అప్పు ఇచ్చుటకు పుచ్చుకొనుటకు:-** అష్టమశుద్ధితో కూడిన లగ్నమందు; స్వాతి, పున, పుష్య, ధని, శ్రవ, శత నక్షత్రములందునూ; చర లగ్నమందునూ, 5, 9 స్థానములందు శుభులుండగా అప్పులు ఇచ్చుటకు మంచిది. మంగళవారం, సంక్రమణదినమందు, హస్తతో కూడిన ఆది వారము అప్పు తీసుకోకూడదు.

**లిక్కర్లు - మత్తు పానీయములు, వ్యాపారమునకు :-** మేష, వృషభ, కర్క, తుల, ధను, మకర, కుంభ, మీన లగ్నములందునూ; మంగళ, శని, ఆదివారములందునూ; భరణి ఆర్ద్ర, ఆశ్రేష, మఖ, పుబ్బ, జ్యేష్ఠ, మూల, పూ.షా, ఉ.భాద్ర, నక్షత్రములందు మంచిది.





# వ్యవసాయ విషయ ముహూర్తములు

**క్రొత్త భూమిలో సాగు చేయుటకు :-** 2,3,5,7,10,11,13, 15 తిథు లందునూ; మంగళ , బుధ, శుక్ర వారములందునూ; అశ్వ, రోహి, మృగ, మఖ, ఉత్త, హస్త, చిత్త, స్వాతి, అనూ, మూల, ఉ.షా, ధని, ఉ.భా, రేవతి నక్షత్రములందు భూమిలో సాగు చేయుటకు మంచిది.

**ఏరువాక, దుక్కి దున్నుటకు :-** ఆది, మంగళ, గురువారములందు; అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, మఖ, హస్త, చిత్త, విశా, అనూ, మూల, పూ.షా, ఉ.షాఢ, శ్రవ, ధని, శత, ఉ.భా, రేవతి క్షత్రములందునూ; వృష, మిథు, కన్య, మీన లగ్నములందు దుక్కిదున్నుట ప్రారంభించుటకు మంచిది. మేష లగ్నమున పశు నష్టము. కర్కాటకమున అధిక వర్షము వలన పంటనాశనము, సింహమున విషజంతుభయం, తులయందు ప్రాణభయము, మకరమున పంట నాశనము, కుంభమున దొంగల భయము కలుగును.

**విత్తనములు చల్లుటకు :-** 2, 3, 5, 7, 10, 11, 13 తిథులందు; అశ్వ, రోహి, పుష్య, మృగ, ఉత్త, చిత్ర, స్వాతి, అనూ, మూల, ఉ.షాఢ, శ్రవ, ధని, శత, ఉ.భా, రేవ తి నక్షత్రము లందునూ విత్తనాలుచల్లిన బాగుగా మొలకెత్తును. ఏరంగుగల విత్తనములు ఆరంగు గ్రహవారాదు లందు చల్లిన బాగుగా పంట పండును. ఉదా:- తెల్ల విత్తనాలు సోమవారం చల్లవలెను. ఈ విధంగా చూడవలెను.

**పొలి పెట్టుటకు :-** 2, 3, 5, 7, 10, 11, 13 తిథులందు; ఆది, గురు, శుక్ర వారములందు; అశ్వ, రోహి, పున, పుష్య, మఖ, హస్త, చిత్త, స్వాతి, అనూ, మూల, శ్రవ, ఉ.షాఢ, ఉ.భా, రేవనక్షత్రములందు పొలిపెట్టుటకు మంచిది.

**వరి ఆకు ఊడ్చుటకు :-** 4, 5, 7, 9,10,11తిథులందు; సోమ, బుధ,. గురు, శుక్ర వారములందు; అశ్వ; రోహి, మృగ, పుష్య, చిత్త, స్వాతి, అనూ, మూల, శ్రవ, ధని, ఉ.భా. రేవతి నక్షత్రములందు మంచిది.

**పంట కుప్ప నూర్చుటకు, వేయుటకు :-** 3, 5, 7, 10, 11, 13, 15 తిథులందునూ; బుధ, గురు, శుక్రవారములు ; అశ్విని, రోహి, మృగ, పుష్య, చిత్త, స్వాతి, అనూ, మూల, శ్రవ, ధని, ఉ.భా. రేవతినక్షత్రములందు కుప్పనూర్చిన వేసిన చాల మంచిది.

**ధాన్యం పొలంనుండి తెచ్చుటకు :-** యజమాని తారాబలం, చంద్ర బలం చూసుకొని వర్జ్య, దుర్ముహూర్తాలు లేకుండా, శుభగ్రహ హోరలలో ఇంటికి కొత్త ధాన్యము, పంటలు తెచ్చుకొనవలెను.

**క్రొత్త ధాన్యం దంచుటకు :-** మఖ, పుబ్బ, అనూ, జ్యేష్ఠ, మూల, రేవతి నక్షత్రములతో కూడిన సింహ లగ్నమునందు చాలా మంచిది. ధాన్యం పాడవదు.

**క్రొత్త ధాన్యమును భుజించుటకు :-** అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, మఖ, హస్త, చిత్త, స్వాతి, విశా, అనూ, మూల, శ్రవ, ధని, శత, రేవనక్షత్రములందు; గురు, శని వారములందునూ; 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులందు; మేష, వృశ్చిక, మీన లగ్నములందునూ మంచిది. అష్టమ చంద్రుడు కూడదు.

**పొగాకు నారు వేయుటకు :-** ఆది, మంగళ, గురు, శుక్రవారములందు; మృగ, పున, జ్యేష్ఠ, అశ్వ, మృగ, పుష్య, మఖ, అనూ, ఉత్తర, ఉ.భాద్ర, రేవతి నక్షత్రములందు వేసిన మంచి ఫలితములు ఇచ్చును.

**అరటి తోట వేయుటకు :-** ఆది, మంగళ, గురు, శుక్ర వారములందు; మృగ, పున, జ్యేష్ఠ, అశ్వ, మృగ, పుష్య, మఖ, అనూ, ఉత్తర, ఉ. భాద్ర, రేవనక్షత్రములందు అరటితోట వేసిన మంచి ఫలితములను ఇచ్చును.

**నర్సరీ వేయుటకు :-** 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులందు; బుధ, గురు, శుక్రవారములందు; అశ్వ, రోహి, మృగ, పుష్య, హస్త, స్వాతి, శ్రవ , రేవ నక్షత్రములందు; మిథు, కన్య, ధను, మీన లగ్నములందునర్సరీ వేసిన మంచిది.

**కంది, సెనగ, పెసర, మినుము, గోధుమ, విత్తనములు వేయుటకు:-** 2, 3, 5, 7, 10, 11, 13 తిథులందు; బుధ, గురు, శుక్రవారములందు; రోహి, మృగ, పున, ఉత్త, స్వాతి, అనూ, మూల, ఉ.షాఢ, శ్రవ, ధని, ఉ. భాద్ర, రేవతి నక్షత్రములందు; వృషభ, కర్క, సింహ, తుల, వృశ్చిక, ధను, కుంభ లగ్నము లందునూ లాభదాయకము.

**ఖర్జూర, పోక, కొబ్బరి తోటలు వేయుటకు :-** బుధ, గురు, శుక్ర వారము లందునూ; శుభ తిథులందునూ; అశ్విని, మృగ, పుష్య, హస్త, అనూ, మూల నక్షత్రములందునూ పై మొక్కలు వేసినచో లాభం కలుగును.

**పిడకలు గూడు కట్టుటకు :-** 2, 3. 5, 7, 10, 11,13 తిథులందునూ; బుధ, గురు, శుక్రవారాలందు; రోహి, మృగ, పుష్య, హస్త, చిత్ర, స్వాతి, అనూ, శ్రవ, రేవ నక్షత్రాదులందు; వృష, మిథు, సింహ, కన్య, వృశ్చి, ధను, కుంభలగ్నాలు మంచివి. లగ్నానికి శుభగ్రహ దృష్టి యుండాలి.

**పొలము కాపలా కాయుట ప్రారంభించుటకు :-** బుధ, గురు, శుక్ర వారములందు ; అశ్విని, కృత్తిక, చిత్త, మూల, ధనిష్ట, నక్షత్రములందు పొలము కాపలా కాయుటకు మంచివి.





## పశు సంబంధ ముహూర్తాలు

**పశుశాల వేయుటకు :-** 2, 3, 5, 7, 10, 11, 13 తిథులందునూ; సోమ, బుధ, గురు, శుక్రవారములందునూ; అశ్వని, మృగ, పుష్య, హస్త, మూల, పూ. భాద్ర నక్షత్రములందునూ పశువులశాల వేయుటకు మంచిది. పుష్యమి గురువారం కలిసిన రోజున వృషభ నవాంశ యందు పశువులు దొడ్డి వేసిన మృత చోర భయములు కలుగక క్షేమముగా యుండును.

**పశువులకు బంధం వేయుటకు :-** అశ్వని, మృగ, పుష్యమి, పుబ్బ, మూల, రేవతి నక్షత్రములందు; ఆది, గురు, శుక్ర వారములందునూ మంచిది.

**పశువులను క్రొత్తగా తెచ్చుటకు :-** ఆది, మంగళ, శని వారము లందు; భరణి, కృత్తిక, ఆరుద్ర, అనూ, మఖ, మృగ, పున, స్వాతి, చిత్ర, మూల నక్షత్రము లందు శుభప్రదం.

**క్రొత్తగా పశువులను కాడి పూన్చుటకు :-** ఆది గురు వారము లందు నూ; అశ్వ, భర, రోహి, పున, హస్త, విశాఖ, జ్యేష్ఠ, శత, రేవతి నక్షత్రములందు మంచిది.

**పశువులను కొనుటకు :-** బుధ, గురు, శుక్రవారములందును; అశ్వ, భర, రోహి, పున, హస్త, విశాఖ, జ్యేష్ఠ, శత, రేవతి నక్షత్రములందు మంచిది.

**పశువులను అమ్ముటకు:-** సోమ, బుధ, గురువారములు ; అశ్వని, మృగ, ఆశ్రే, మఖ, హస్త, విశా, జ్యేష్ఠ, పూ. షా, ధని, పూర్వాభాద్ర నక్షత్రములు మంచివి.

**పశువులను పశువులశాలలో కట్టుటకు :-** అశ్వని, మృగ, పుష్య, హస్త, మూల, పూ. భాద్ర నక్షత్రములందు క్రొత్తగాపశువులను కట్టిన పశువృద్ధి కలుగును.

**దూడలను దుక్కికి మప్పుటకు :-** 2, 3, 5, 7, 11, 13 తిథులందు నూ; ఆది, సోమ, గురు, శుక్రవారములందునూ; అశ్వని, రోహిణి, మృగ, పున, పుష్య, మఖ, ఉత్త, హస్త, స్వాతి, విశాఖ, అనూ, మూల, ఉ.షాఢ, శ్రవ, ధని, శత, రేవతి నక్షత్రములందు మంచిది.

**పోతులను పూన్చుటకు :-** 4,8,9, 14 అమావాస్య తిథులందునూ, ఆది వారము లందునూ; భరణి, రోహి, చిత్త, ఉత్తర, ఉ. షాఢ, శ్రవణ, ఉ. భాద్ర, నక్షత్రము లందు పూన్చుటకు, దుక్కి కట్టుటకు, కాడి పూయుటకు శుభము.

### జల సంబంధ ముహూర్త విషయాలు

**గాలము ముహూర్తము :-** 1, 2, 3, 5, 7,10,11,13,15 తిథు లందునూ; సోమ, బుధ, గురు, శుక్రవారములందును; రోహి, మృగ, ఆర్ద్ర, పున, పుష్య, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశా, అనూ, పూ. షాఢ, ఉ.షాఢ, శ్రవ, ధని, శత, పూ. భాద్ర, ఉ. భాద్ర, రేవతి నక్షత్రములందు ; వృషభ, మిథున, కర్కాటక, తుల, మకరం, కుంభ, మీన లగ్నములందు మంచిది.

వల ముడుచుటకు :- సోమ, బుధ, గురు, శుక్ర, వారములందును; రోహిణి, పుష్యమి, ఆర్ద్ర, ఉత్తర, ఉ.షాఢ, శ్రవణ, ధనిష్ఠ, శత, ఉ.భాద్ర నక్షత్రములందునూ మంచిది.

వలనీటిలో తడుపుటకు :- 1,5,10,11,15 తిథులందునూ; బుధ, గురు, శుక్రవారము లందు; అశ్వని, రోహిణీ, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, ఉత్తర, ఉ.షాఢ, ఉ.భాద్ర, అనూ, శ్రవణం, రేవతి నక్షత్రములందునూ మంచిది.

పడవలు తయారు చేయుటకు :- 2,3,5,7,10,13 తిథులలో; బుధ, గురు, శుక్ర వారములలో; అశ్వని, రోహి, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, ఉత్త, ఉ.షాఢ, ఉ.భాద్ర, అనూ, శ్రవణ,రేవతి నక్షత్రములందు, వృషభ, మిథున, కర్కాటక, కన్య, తుల, ధను, మీనలగ్నములందు పడవలు తయారుచేయుటకు మంచిది.

పడవలను నీటిలో దింపుటకు :- 2, 5, 7,10,11,13 తిథులందునూ; సోమ, బుధ, గురు, శుక్రవారములందు; అశ్వని, మృగ, ఆర్రే,మఖ,పుబ్బ, హస్త, చిత్త, విశా, మూల, పూ.షాఢ, పూ.భాద్ర, రేవ నక్షత్రములందునూ; మేష, మిథున, కర్కా, తుల, మకర, మీన లగ్నములుమంచివి.

లాంచీలు, క్రొత్త పడవలు ప్రయాణమునకు :- 2,3, 5,7, 10, 13 తిథులందు;సోమ, బుధ, గురు శుక్రవారములందునూ; అశ్వ, మృగ, పున,పుష్య, హస్త, అనూ, జ్యేష్ఠ, శ్రవ, ధని, రేవనక్షత్రములందునూ ; మేష, వృష, కర్కా, కన్య,తుల, ధను, మీన లగ్నములు, లగ్నబలము, పంచమ శుద్ధి, ఆనందాది యోగాలు, శకున బలము ఉన్నచో శుభము.

చేపల చెఱువులు త్రవ్వుటకు :- 2,3,5,7,10,11 తిథులందునూ; సోమ, బుధ, గురు; శుక్రవారములందునూ; అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, స్వాతి, ఉ.షాఢ, శ్రవ, ధని, ఉ.భా, రేవ నక్షత్రములందునూ ; కర్కా, ధను,మకర, మీనలగ్నములందు చేపల చెఱువులు త్రవ్వుటకు శ్రేష్ఠము.

## వివాహముహూర్తమునకు బలాబలాలు

వివాహము మానవునకు నూరేళ్ళపంట. వివాహమునుండి మానవునికి అనేక బంధాలు ఏర్పడును. అట్టి వివాహమునకు మన ప్రాచీనమహర్షులు అనేక నియమాలుగా ముహూర్తములు నిర్ణయించిరి. కాని ప్రస్తుతం వాటిలో కొన్నింటిని విస్మరించి ముహూర్త నిర్ణయాలు చేయుట వలన భార్యభర్తలు సఖ్యత కోల్పోయి విడిపోవుట ప్రస్తుత కాలంలో చాల ఎక్కువగా కనిపిస్తున్నది.

కావున వివాహముహూర్త నిర్ణయం చేసేటప్పుడు ఈ క్రిందిజాగ్రత్తలు తీసుకొని ముహూర్త నిర్ణయం చేసినచో దంపతులు తప్పక చిరకాలం నివసించి భోగభాగ్యాలు, కుటుంబ సౌఖ్యములు పొందగలరనుటలో సందేహము లేదు.

1. వధూవరుల జన్మ లేదా, నామ నక్షత్రాలను బట్టి వివాహము హూర్తమునకు తారాబలం చూడాలి.
2. కన్యా దాతలకు కూడా వివాహ ముహూర్తమునకు తారాబలం చూడాలి.
3. వధూవరుల తారలకు పరస్పరం తారాబలం చూడాలి.



4. ముహూర్తమునకు నిర్ణయింపబడు సమయమునకున్న తిథి,వార, నక్షత్రములచే చూడాలి. అన్య నక్షత్రాలు మంచివి కావు. కొంత మంది సోమవారం వ్రాస్తున్నారు.కాని శాస్త్రసమ్మతం కాదు. అనుభవంలో ముహూర్తము సత్ఫలితములు ఇచ్చుటలేదు.
5. లగ్న బలం చూడాలి. 6, 8, 12 రాశులందు చంద్రుడు ఉండరాదు.
6. లగ్నమునకు శుభులైన గురువుగాని, శుక్రుడుగాని చూస్తుంటే పై దోషము స్వల్పం.
7. శుక్రుడు ఆరింట ఉండరాదు. గురు దృష్టి లగ్నానికి గాని శుక్రునకు గాని ఉన్నచో మంచిదని కొంతమంది అభిప్రాయం. కాని వీరు లగ్నానికి పాపులైనపుడు పాప ఫలితములనే ఇస్తున్నారు.
8. అష్టమమందు కుజుడు ఉండరాదు. కుజుడు శుభుడైనను ఈ విషయంలో రాజీ కుదరదు.
9. సప్తమమునందు అష్టమమున ఏ గ్రహం కూడా ఉండరాదు. కొంతమంది శుభగ్రహాలైన గురు, బుధ, శుక్రులు, పూర్ణ చంద్రుడు ఉన్నచో పెట్టవచ్చును అనుచున్నారు. కాని తగదు.
10. ముఖ్యంగా వివాహమునకు వివాహ చక్ర శుద్ధి తప్పక చూడాలి. ప్రస్తుతం దీనిని ఎవ్వరు చూచుట లేదు.

## వివాహ చక్రం

రవి యున్న నక్షత్రం నుండి వివాహ నక్షత్రం వరకు లెక్కింపగా

| | | |
|---|---|---|
| 3 హాని | 12వైధవ్యం | 21 వ్యభిచారం |
| 6 శుభం | 15 కులవృద్ధి | 24 ధనవ్యయం |
| 9 పుత్ర హాని | 18 మరణం | 27 సంపద |

## వివాహమునకు త్రిజ్యేష్ఠ విచారణ

తొలిచూలు వరుడు, తొలి చూలు వధువు, జ్యేష్ఠ మాసము వీటి మూడింటికి త్రిజ్యేష్ఠ అని పేరు. దీనిలో ఒక జ్యేష్ఠ శుభం. రెండు జ్యేష్ఠలు మధ్యమం, మూడు జ్యేష్ఠలు హానిని కలిగించును.

లగ్నబలాలు :- వివాహలగ్నమునందు లగ్నమునకు శుభులైన బుధ, గురు, శుక్రులు ఉంటే అగ్ని దూదిని కాల్చినట్లు సమస్త దోషములు పోగొట్టును. వివాహలగ్నమునకు బుధ, గురు, శుక్రులలో ఏ ఒక్కరైన స్వోచ్ఛ, మూలత్రికోణ, మిత్ర స్వక్షేత్రములందునూ 1, 4, 5, 9,10 స్థానములందున్నచో అసంఖ్యాకమగు దోషములను పోగొట్టును. (కేంద్రాధిపత్య దోషం ఇక్కడ కూడా గురుశుక్రులకు చూడాలి.)

పార్వతీ పరమేశ్వర యోగం :- లగ్నమందు గురుడు, లాభ రాశియందు కుజుడు, ధన స్థానమందు రవి యున్న పార్వతీ పరమేశ్వర యోగము. ఇట్టి ముహూర్తమున వివాహం జరిపించిన దంపతులు చిరకాలం జీవించి భోగభాగ్యములు, సుఖ సంతోషములు తప్పక పొందుదురు.

లక్ష్మీనారాయణ యోగం :- లగ్నమందు శుభుడైన గురుడు, తృతీయ మందు శుక్రుడు, ఆరింట రవి, తొమ్మిదింట కుజుడు ఉండిన లక్ష్మీనారాయణ యోగము అందురు. ఇట్టి ముహూర్తకాలంబున వివాహం గావించిన ఆ దంపతులు సుఖకరంగా జీవితాంతం జీవించగలరు.

పై యోగాలు లగ్నమునకు ఆయా గ్రహములు శుభులైనపుడు మాత్రమేనని గ్రహింపవలెను.

